మం. అచటిస్త్రీచారాదు లన్నియు నాకు, సరిక్రొత్తవై పెల్లు సంకటపెట్టఁ
గడుజాగరూకతఁ గాలంబు గడపు, టనివార్య మయ్యె నయ్యాదియును గాక
యాకుబువ్వప్రతిజ్ఞ నావంతయేని, నాయాశ దీక్షమైఁ బాలింప వలయు
నిటఁ దినుబండంబు లిష్టము ల్గావ, యటు పోయి యిటు గోయి [illegible] మె నామనికి
యింగ్లండులో నుంట కే నేరనైతి, మాతృవశముకే మరలనైతె
నీ మూఁడువర్షంబు లెట్టులో గల్వ్వ, మని ప్రబోధించె నాగుణంతిరాత్మ. ౧౯

* * *

## ౧౪ నా య భి రు చి

క. మోహాతా మతియొకి పఁ మద్, గృహము కేతెంచి తత్పరిస్థితుల నెఱుం
గి హసించి యిట్టినిలుకడ, స్పృహణీయము గా దటంచుఁ బెదవి న్విఱిచెన్. ౧

వ. వెండియు నతండు ౨

క. ఒంటరివై నీ వీగది, నుంటన్ ఫల మేమి యేతదుక్తికిఁ జదువుం
గొంటక వచ్చితి నైనను, గింటయు నక్కఱయె యిందుఁ గిలనడెవ్వన్. ౩

తే. ఎవ్వరికుఁ గాంబమందైన నెనసి యున్నఁ, గాని చిక్కదు తత్పరిజ్ఞాన మెల్ల
నందు వర్తింపఁ దగునేర్పు నభ్యసింప, నలయు మున్ముందు హితులైనవారిఁ జేసి. ౪

క. నాయనుఁ గొక్కిండు పెలం, డాయనుడ నిల్వు మిప్పు డని పల్కెడు నే
నీయకొని తద్గృహమునకుఁ, బోయితి నన్నతఁడు మిత్రుపోలికఁ జూచెన్. ౫

ఆ. సుతియుఁ దెల్లవారిమర్యాద లెఱిఁగించి, యాంగ్లభాష మాటలాడఁ జేసి
యింకుగొంకు లెల్ల సడలించెఁ గాని నా, కొంట దయ్యె నతనియింటివంట. ౬

సీ. త్యాజ్యంబు లగుఁ గొన్నిభోజ్యముల్ చవిగొమి, నిష్టమొనపదార్థ కొని మగుడ
నరంప సిగ్గు దా నష్టమై కరము నన్, బాధింపఁ దొడఁగు నిప్పగిది ననుది
నం బుపవాసకల్పం [illegible] యాంచి మెక్క సులభము నెల్లనాఁడు
జెలికాఁడు వాదంబు సేయుచు [illegible], నురవిస్త దిలకించి పరితపించి

ఆ. యపల నాప్రమాణ మతనికిఁ దెల్పి నా, మనసునుందువాఁడు గొన్నివాస
రమ్ము లిట్లు గడవ నమ్మిత్రునకును దు, ర్భరము యయ్యె నాదువర్తనంబు. ౭

వ. ఒక్కనాఁ డతడు నన్గాంచి

తే. ఈవు మతోఁ్సదరుండవై తేని దఱిమి, యుందు నిన్నెన్నఁడో శంక నందఁబోక
యిట్టివెడఁగుఁదనంబు నీ కెట్టు లొదవె, నవ్వరే బుద్ధిమంతు లీనడత విన్న. ౮

తే. ఇచటియక్కఱ లించుకే నెఱుంగ లేక, చదువుగొంద వెఱుంగని జనని చెంత
నాచరించినబాసకై యడలె దేల, యెట్లు బోధించు నది దాని కేమివిలువ. ౧౦

తే. అది ప్రమాణంబ కాదు న్యాయంబు ననుస, రించియును బాసగా నదియెంచఁబడద
దానికిం గట్టువడుట యజ్ఞాన మిట్టి, పట్టుదల యున్న నచట లాభంబు సున్న. ౧౧

తే. మున్ను నీ వామిషంబును దిన్నయట్లు, నది రుచించినయట్లు నాడెదవు బళిరె
కోరి యక్కఱలేనిచో నారగించి, యున్నచో నొల్ల నందు వేమోయి వెఱ్ఱి! ౧౨

క. ఇది నీదురదృష్టం బని, మది నెంచెద ననియె నేను మాత్రము దీక్షన్
వదలుకొననైతి నించిన, పదార్థముల నిల్పుచుంటిఁ బ్రాణము నొడలన్. ౧౩

క. ఎఱచి న్గుఱిచియ మా కి, ద్దఱకున్ దినదినము చర్చ తెఱపిగ జరుగన్
దొరఁకొనె నాతని తర్కము, పెరుఁగుకొలఁది నేను బెట్టుబిగియుచు నుందున్. ౧౪

క. అనుదినము రక్షణకై, వినుతించుచు నంటె విశ్వవిభు నప్పుడదియున్
బనుపడుచు నుండె నివ్వీఁ, కి నొసర్పం బ్రత్యయంబు కారణ మయ్యెన్. ౧౫

వ. అదియుం గాక్క మాదాసి యగు రంభ గుప్పినబీజంబ యిట్లుండ నొకనాఁడు
నాచెలికాఁడు బెంథమను నతఁడు రచియించినవస్తూపయోగసిద్ధాంతము గ్రంథముం
జదువ మొదలిడె - నందలిభాష నాకు దురవగాహం బగుట నతండు తద్విశేషం
బుల నెల్ల నెఱుకసేయఁ దొడంగె - నంత నే నతని కిట్లంటి. ౧౬

సీ. నెచ్చెలీ! నన్ను మన్నింపు నాకు నగమ్య, విషయంబు లిట్టి వామిషము దినుట
యావశ్యక మటంచు నంగీకరించెదఁ, గాని నాశపథంబు మాన నొల్ల
నద్దానిగుఱిచి వాదాడ వాదమునందు, నిన్నోర్వలే నంట నిక్కువంబు
మొఱ కనియో జగామొండివాఁ డనియొ భా, వించి న న్విడువు ముద్వేలమైన

అ. నెనరు సూపు నిన్ను నే మఱవంజాల, నస్మదీయసుఖము నభిలషించి
విడువ కిట్లు నీవు నొడువుచున్నాఁడ వం, చే నెఱుంగ నోటు హితవతంస. ౧౭

ఆ. ఐన విడువనోప నూనినసమయంబు, బాస బాసయేకదా సఖంబు
దాని సతకరింపఁ దగదు సుమా నీకు, నెఱుఁగవడనిఘరుక్ర వెద్ద గలదు ౧౮

క. ఇవ్విధిఁ బల్కుఁడు నెయ్యుఁడు, నివ్వెఱఁగుం బెంది బళి నీ … కే నే
నివ్వాదం బొనరింపను, జు న్వ! భవన్నియమసద్ధి సుశ్లాఘ మనెన్. ౧౯

క. అందుల కే నెంతేయు ముద, మందితిఁ బలలంబుఁ గూర్చి యతఁ డవ్వలఁ జ
ర్చం దెచ్చుట విడిచియు నెద, యందున్ నను గుఱిచి సేయు ననిశము చింతన్.

ఆ. తాప్రివు నతఁడు చుట్ట సేవించు మద్యంబు, వాని నభ్యసింప నలయు ననఁడు
మఱియు వాని నెపుడు మరగకు మని నన్ను, హెచ్చరించు నెయ్యమచ్చుపడఁగ.

తే. తొలుత నెంచితిఁగాని య త్తలఁపు దూర,మయ్యె నీనాఁగు నే నిపు డారగించు
నాకుబుద్ధి జగమ్మునయందు వెల్లి విరియఁ జేయుటయే నాకు వేడ్క యయ్యె.

* * *

## ౧౫ ఆంగ్ల వేషము

సీ. కొనలొ త్తఁ దొడఁగె నాకుంబుద్ధిదేశ నాకు,నాఁటి కేడఁగులో నమ్మకంబు
చదువఁజాగితిని భోజనముఁ గూర్చి రచింపఁ బడినపొత్తముల సంబరము గదుర
బోధించె నవి క్రీస్తుమున్నగుమహనీయు,లెల్ల శాకాహారులే యటంచుఁ
దెలిపె శాకాహారదీక్షితుల్ పూర్ణాయు,రారోగ్యసంపన్నులగుదు రనియుఁ
తే. బిడప భోజ్యపరీక్ష నాబ్రతుకునందు,ముఖ్యమగు కృత్య మయ్యె మున్ముందు దీని
మొదలుపెట్టుట యారోగ్యమునకయైన,నవల ధర్మప్రవృత్తియె హేతువయ్యె నింక.

క. ఈపగిది నేను గాల,క్షేప మ్మొనరింప నాదుచెలికి మదన్న
వ్యాపారజనిత మగు సం,తాపము రూపడఁగదయ్యెఁ దా లవ మేనిన్. ౧

సీ. ఆమిషాహారంబు నంగీకరింపక యున్న,దేహపాటవ మొగి నెరలు ననియుఁ
దెల్లవారలఁ గూడి తిరుగక యున్నచో,జడబుద్ధినై యేను జెడుదుననియు
నాకుబుద్ధిను మెచ్చునట్టివాఁడతలఁ గన్న, విపరీతములు సంభవించు ననియు
నాహారపరిశోధనార్థినై మెలఁగుచో,భువి నిరర్థకుఁడనై పోదు ననియు
ఆ నాతఁ డూహచేసి నాతత్త్వమును మార్ప,యుక్తి యొకటి పన్ని యొక్కరేయి
నాటకంబు సూడ నను రమ్మటం చన,నతనివెంట వేడ్క నరిగినాఁడ. ౩

క. ఎరకొల క త్తటి మునుముం,దరువుర మొకపూఁటకూటియిలు సేరితి మ
య్యిరవు నరసాలభవనము,కరణి విగాజిల్లు శిల్పకళ కాశ్రయమై. ౪

వ. అందు నాగరకు లనేకులు మెసవుచుండురు – గాన నటకు నన్నుం గొనిపోయిన నవినయ భయంబునం జేసి భోజన మధ్యమున నద్దె నెట్టిసందియములనేని వెలువరింపఁజాల నని నామిత్రుఁ డూహించి యీపన్నుగడం బన్నె–నంతఁ బెక్కండ్ర నడుమ నే మొకబల్లముం దుపవిష్టుల మగుడుఁ బ్రథమభోజ్యంబుగా సూపను పదార్థంబు మా కొసంగఁ బడియె – నయ్యది శాకాహార మగునో కాదో యను సంశయంబు నన్నుఁ బీడింప నద్దానిగుఱించి నేస్తకాని నడుగనొల్లక మెల్లన వడ్డన సేయువానిం జీరితి – నయ్యవసరంబున ౫

క. అద్దాని నెఱిఁగిమిత్రుఁడు,గద్దించుచు నతనిఁ బల్కెఁ గత మే మన నేఁ
దద్దయు వెనుకాడుచుఁ గల,సుద్ది న్వినిపింప నతఁడు చుఱచుఱఁ గనుచున్. ౬

తే. నిమిషమే నిట్టిసంపూన నీవు నిలువ,నర్హుఁడవు గావు వలయుమర్యాద నెఱుఁగ
వేని వేవేగ నొండొక్క-యెడకు నడిచి,కుడిచి వాకిట నారాకకొఱకు నిలుము. ౭

ఆ. అనుడు సంతసించి యచ్చోటి నెడఁబాసి ,పొంత నున్న మూఁకుబువ్వ బసకు
దాసిచూడ వేళతప్పుట నది మూయఁ,బడియె నౌర నాయభాగ్యమహిమ. ౮

ఆ. నాఁటిరేయి నాకుఁ గాఁకిల్లె నుపవాస, మంత చేము నాటకావలోక
నాభిలాషఁ జనిని మన్వాల గాత్రఁ డి,గ్గొడవ నెన్నఁడేని విడన పయ్యె. ౯

ఆ. ఇదియ మాకుఁ బుట్టుగుదిజగడము దీనఁ,బొడమదయ్యె నెట్టిపొరపు మాకు
నెయ్యుఁ డిట్లు పలుకఁ దియ్యంబ హేతువు, గాన నాని మిగుల గారవింతు. ౧౦

వ. తలఁపుసేతల మా కెంతయంతర మున్నను నతఁడు నా హితుఁడగుటం జేసి సర్వదా నాని గౌరవించువాఁడ- నంత నే నామిషమును ద్యజించినను దక్కుంగల మర్యాదలం దాంగ్లేయసంఘసంప్రదాయములు చక్కఁగా ననుసరింప నేర్తునని సంగడీనికిం దెల్లముసేయనెంచి మునుముందు వలయుదుస్తుల న్గొలిచి వేషము సవరించి పాపట సంస్కరించి నాట్యమును బరాసుబాసను గఱచినం దప్ప నాగరికత పూర్ణతం జెందదని విని వ్యయప్రయాసముల కోర్చి యొక శిక్షాశాల నాశ్రయించి కొన్ని నాళ్ళు నృత్యము నభ్యసించితి- నందలి తాళగతిం దెలియ నే నశక్తుండ నగుటం దత్సిద్ధికయి గోఁచిపాత్రతకొఱకుఁ గొండంత సంసార మన్నట్లు ఫిడేలు నభ్యసించు నవస్థ నాకుఁ బాటిల్లె- వెండియు వక్తృతాపద్ధతి నెఱుంగ నొండొక యొజ్జను సేవింపఁ దొడఁగితి-నగ్గురుఁడు జెల్లను నతండు గూర్చిన యాదర్శవక్త యను గ్రంథముం బఠనీయముగా నియమించె-నందలి యుపన్యాసము నొకదానిఁ జదువ దొరఁకొంటి-నింతలో నా బెల్ మహాశయుఁడు నాశ్రవఃకుహరమున ఘంటానాదము సల్పుడు నే మేలుకాంచి ౧౧

మం. ఆ జీవితాంత మియ్యాంగ్లదేశమున, నే నుంట కల్ల యింకేల యీ బెడఁద
యరుగుదెంచితిని విద్యార్థినై యిటకుఁ,దత్సమార్జనమె కర్తవ్యంబు నాకు. ౧౨

తే. ఇటు విచారించి నైళంబ నటన గీత,వాగ్మితాభ్యాసముల కెల్ల స్వస్తి చెప్పి
గురుల మన్నింపుఁ డని పేర్మి మొఱయ వేఁడి,యవల నిక్కపువిద్యార్థి నైతి నేను.

తే. నృత్యగీతాదికాసక్తి రెండుమూఁడు,మాసములె నిల్చి పిదప నన్బాసెఁ గాని
వేసమునయందుఁబొడమిన వెఱ్ఱివలపు,విడువదయ్యెను బెక్కేండ్లుగడచుదనుక.

* * *

మం. శాకాన్నవిక్రియశాలకు నేగి,యిచ్చవచ్చినవస్తు లెల్లను మెక్కి-
విపరీతముగ సొమ్ము వెచ్చింపఁ బోక,పరిమితవ్యయదీక్షఁ బాటించు టాది
నిత్యంబు నాఱుపెన్నీల భక్ష్యముల,నియమంబునైఁ గొని నే నారగింపఁ
గడఁగినవాఁడ-నక్కాలానఁ బిండి,గలభక్ష్యముల ముట్టకయ కొన్నినాళ్ళు
కడపితి మఱికొంతకాలంబు రొట్టె పండ్లు భుజించితిఁ బదపడి గుడ్లు
జున్ను పా లారగించుట దొరఁకొంటి,గుర్తింపఁ దగిన దిక్కానశోధనంబు. ౯

తే. అపుడుసంస్కర్తయొక్కరుఁడండములభు,జించుచోఁ బెక్కుమేళ్లు ప్రాప్తించుననియు
నది మెఱచితిండిలోఁ జేర దనియుఁ దెలుప,నచ్చె నాతనివాదంబు నాదుమదికి.౧౦

క. అంతట నండము జీవ,జ్జంతువు కానేర దంచు సామాన్యముగన్
స్వాంతమునయందుఁ దోఁచును,సంతసమున దాని మెక్కఁజాగినవాఁడన్. ౧౧

వ. పరాహసనం దొడరిన యిక్కడుపున నదునై దుదివసంబులునూత్రిమ మొసవి యంత
నియ్యది యకార్యమని యెఱంగితి – నామున్ను సల్పినశపథంబునకు నేఁడు నూత
నార్థ వివరణ మొనర్చుట నీతికి విరుద్ధంబు – గుడ్లును బలలంబులోనివ యని
మజ్జననియభిప్రాయం బగుట నిక్కంబు – కాన నిబ్బాసయందలి పరమార్థంబు
నామదికి గోచరించిన మఱునిముసంబ యండములం దినుట మాని యాహారపరి
శీలనమ్మును సైత ముజ్జగించితి – మఱియు ౧౨

సీ. ఆంగ్లదేశమ్మునం దామిషంబును గూర్చి,కనుఁగొంటి మూఁడులక్షణము లొకటఁ
బహుపక్షిపలలంబ పలల మిమ్మతమువా,రెన శాకాహారు లండములను
జేపల నారగించెదరు వే ఱొకదాన,నెల్లప్రాణులమాంస మెఱచి, దీన
నారగింపఁగవచ్చు నండము లొండొక,దాన సర్వప్రాణితరస మండ

ఆ. ములును బాలు పెరుఁగు మున్నగునవియు గ,ణ్యములు మాంసగణమునందు,నట్టు
లగుట నాకుబువ్వయంగళ్ళఁ బెక్కుభ,క్ష్యముల గుడ్డుకలియుననుచుఁదోఁచె. ౧౩

తే. కావుటంజేసి యచటిభక్ష్యముల మెసవు,వేళలం దెల్ల నవ్వానిమూల మడిగి
యండములు చేరకున్న భోజ్యములు విలిచి,యారగించెడివాఁడ నే ననుదినంబు.

వ. దీనంజేసి యిష్టంబు లగు భక్ష్యములు పెక్కింటిని విడువ వలసెఁ – గాని నాయొ
నర్చినబాసను దీక్షమై రక్షించుచుంట నియ్యది నా కసంతృప్తి గూర్పదయ్యె –
మఱియు ౧౪

తే. ఎంత తెల్లమై తనబాస యెసఁగుచున్న,నాత్మచరితావిరుద్ధమై యలరుపోల్కి
దానికి న్నూత్న నూతనార్థములు వెల్ల,డించెదరు కొంద ఱేతత్ప్రపంచమందు.

క. కల రిట్టివారు లక్షలు,గలవారలయందు లేమిగలవారలయం
దలసార్థపిప్రియతయ వా,రలకన్నులు గప్పు నద్గిరా యే మందున్. ౧౫

తే. కొంకుజంకులు వీడి వా గ్గోడమీఁది, పిల్లివాటముగా విజ్ఞు లెల్ల రోయఁ
బలికి యాత్మవంచనమును జలిపికొని జగమ్ము దైవమ్ము వంచింపఁ గడఁగుచుంద్రు.

తే. బాసచేసినమనుజుఁ డబ్బాస నెవ్వఁ, డాచరింపఁగఁ జేసె నయ్యతనియర్థ
మనుసరించుట సంశ్లాఘ్య మైనమార్గ, మని వచింతురు ధర్మజ్ఞు లైనబుధులు. ౧౯

క. రెండర్థంబులకును వీ,లుండిన దుర్బలునినుడికి నొడఁబడఁ దగు నీ
రెండు తెఱంగులఁ దొఱఁగిన, నిండుఁ బెనఁకువలు పాడినెఱి పొడవడఁగున్. ౨౦

వ. సత్యమునకుం గొల్లుసల్పువాఁడు మొదటిమార్గంబు దొక్కుటయు నాంగీకించు-
నాతఁడు నూతన వ్యాఖ్యానములకొఱకు సూరిజనమ్ముల నెన్నఁడు నారాధింప
నొల్లఁడు- పలలముంగూర్చి యుత్తమసరణి ననుసరించి చూడ నాతల్లియూహించిన
లక్షణంబ నాకు శిరోధార్యంబు-కాని యన్యం బపశ్యపరిహార్యంబ- వెండియు ౨౧

మం. నాసల్పుపరిశోధనమ్ము సర్వమ్ము, నార్థికదృష్టి సమారోగ్యదృష్టి
ననుసరించియ సాగె నాంగ్లదేశము, నవ్వల సక్కాన్య మాఫ్రికాయందుఁ
నాచరించితిని ధర్మైక వశా దృష్టి, ముందు వాకుప్రవృత్తి సమ్మెచ్చట నెల్ల,
నెటులైన దీనికి నింగ్లాండునందఁ, జరిగె బీజావాపసంస్కార మెల్ల. ౨౨

ఆ. మాంసభక్షణంబ మంచి దటంచు నేఁ, బెక్కునాళ్ళు నమ్మి పిదప శాక
భోక్తనైతిఁ గానఁ బూర్ణాభిమానంబు, పొడమె నాకు నాకుబుస్వపట్ల. ౨౩

తే. తడవ్రలంబట్టి యొక్కమతమ్మునందు, వెలయునాతిపకం జ నవీనముగ న
దానిఁ జూచినవాని కద్దాన మివుల, నాదరముకల్గునంట సత్యమ్ము గాదె. ౨౪

వ. ఏత దభిమానఫలితమ్ముగా నావసించు పేటయం దొక శాకాహారిగోష్ఠి నెల
కొల్పి దానికి శాకాహారపత్రికాసంపాదకు లగు నోల్డుఫీల్డుగారి నధ్యక్షులఁ జేసి
నేఁ గార్యదర్శిపదవి స్వీకరించితి - నయ్యది కొంతకాలము శ్లాఘనీయమ్ముగా
జాగియు నే నప్పేట వీడి వేఱొక్కదెసకుం జన్న వాటిల్లుటంజేసి కతిపయ
మాసమ్ములలోన నొడివడంగ - నైనను ౨౫

తే. వినయపూరిత మిప్పాటియనుభవంబు, కొన్నిసంఘముల న్నెలకొల్పి వాని
వ్యాపనీయమ్ము లొనరింప నర్హమైన, చాకచక్యము నాకు నొసంగె నెన్న. ౨౬

* * *

## ౧౮ విడియము నాడాలు

సీ. శాకభోజనసమాజమునందు నేఁ గార్య సంఘసభ్యుఁడనై యొసంగుకతన
వెడలుచుందును సమావేశంబు లన్నిటి, కైన మానంబు నా కిచటఁ దప్ప
దధ్యక్షుఁ డిది కూడ దని పెక్కుసార్లు నన్, మమత దీపింపఁ దా మందలించెఁ
గొలువులో మాటాడవలయుననొక్కొక్క నా, కెంతయుఁ గల దైన నేమిలాభ
ఆ. ముల్లమందుఁ గొడము సగాహమ్ముల మెగు, నట్టిబాసయందుఁ బెట్టఁజాల
మొదలుకొన్నవిషయములు దప్పి యపస్కృ, తాంశచర్చలోస నసుగువాఁడ. ౧

ఆ. కడచె నిట్లు కొంతికాల మవ్వేల నొక్క, సారి ముఖ్యవిషయచర్చ యొకటఁడు
వాపరించె సమితిఁ, దత్సభయందుఁ బొల్గొనమి ధర్మదూరమనుచుఁ దోఁచె. ౨

క. రచ్చకు నేగియు భావం, బచ్చుగనువిధాన మాటలాడక యిస్సీ
యొచ్చెముగ మూఁగసమ్మతి, నిచ్చుట భీరుత్వ మంచు నెంచితి నెడఁదన్. ౩

వ. తత్సభకు సమోవ్యాపారసంఘనాయకుఁ డగు హిల్సను నతఁ డధ్యక్షుఁ - డాతఁడు నీతివాదియనం దగు - నాయన యొనర్చు నార్థికసాహాయ్యంబుపైన తత్సంఘ మాధారంపడి యుండె - సామాజికులు పెక్కం డ్రితనికనుసన్నల మెలఁగుచుండు - రాకుబువ్వదెస నిందుగారవఁబుగల యల్లిన్సనను నతఁడుం బాలకసంఘమున వెలయు - నప్పుడ యంకురించిన సంతాననిరోధోద్యమం బతని కభిమానపాత్రి మగుడు నతఁ డద్దానిఁగూర్చి కార్మికులకు బోధింపఁ దొడఁగె - నిట్టి యాచారంబు నీతిదుర్నియమంబునకు వేరుపర్వంబోని దని హిల్సుతలంపు శాకాహార సమాజము నైతికసేవ సయిత మాచరింపవలయు నని యతని యాశయము - కాన విపరీత భావభరితుడగునల్లిన్సను తత్సంఘమునం దుంట చెట్టకుఁ బట్టుఁగొమ్మని యయ్యధ్యక్షునిభావంబు - కావుటంజేసి యల్లిన్సనుసభ్యతను రద్దుపఱుపవలయు నను నిర్ణయము సభం బ్రతిపాదిత మయ్యె - నంత ౪

తే. తద్విచారంబు నాదుచిత్తమును దిగువ మంచిచెడ్డల నే విమర్శించి కనుడు
జన్మశాసనవాదియాశయము లెల్ల, నత్యపదనికారు లటంచుఁ దోఁచె. ౫

తే. హిల్సు తా నీతివాదియై యొసఁగుకతన, నాతఁ డల్లిన్సనునకుఁ బ్రత్యర్థియగుట
ధర్మ మని తోఁచె నాతఁ డౌదార్యభరితుఁ, డగుట మన్నింతు నతని నేనగ్గలముగ.

మం. ఐనను నీతియం దాశయభేద, మున్నంతమాత్రాన నొకనిసభ్యతను
రద్దు సేయుట నీతిరహితకృత్యంబ, యని బోధచేసె నాదగునంతరాత్మ

సంఘమ్ములక్ష్యంబు శాకభోజనము, నెరయుటకై ప్రయత్నించుచే కాని
యింకేట్టినయమార్గమేని విస్తృతము, గావింపఁ బూనుట కాదట్టు లగుట
నీతింగుఱిచి యెట్టినియమంబు లున్న, శాకభక్షణమును జల్పువా రెల్ల
నర్హు లేతత్సంఘమం దిమ్ముకొనఁగ, ననుచు భావించితి నంతరంగమున. ౮

తే. సాంఘికులు కొంద ఱేతదంశమునఁ దగవు, నెంచి నాతోడ నేకీభవించి రైన
నేన యిమ్మాట మాటాడ నెంచినాఁడఁ, గాని కఱవయ్యెఁ దాల్మి త త్కాలమందు.

వ. కావున నాపల్క నెంచినపల్కుల నెల్ల నొకపత్రముపై లిఖించికొని సభకుఁ జేరి యదియుం బఠింపఁజాలక రచ్చపెద్దను దాని నందిచ్చుచు నతఁడొకసభ్యునిచే దానిఁ జదివించె - నంత నల్లిన్సనుపక్షంబునకె యోటమి వాటిల్లెఁ - బ్రథమప్రయత్నము నంద నా కపజయంబు సిద్ధించె-నైనను నాయాశయము ధర్మ్యంబకదా యనుతనివి నా కెంతయుఁ గల్గెఁ - దదనంతరము నేను నా సభ్యత్వం బ్యజించినయ ట్లించుక జ్ఞప్తికలదు - సీమయం దున్నకాలమెల్ల నిట్టివ్రీడాభరముతోన కడచె - నీలజ్జ సభలయంద కాక చెలికాండ్రమిత్రిపట్టులందును నన్నుఁ బీడించు-వెండియు ౯

తే. వెంటనరు నా జెలంగెడిపేటి కొక్క, నాఁడు త్ర్యంబకరాయితోఁ గూడి చనితి
నచట మ మొక్కసభలోన నాకుబున్వఁ, గూర్చి భాషింపుఁ డని చెలుల్ గోరి రపుడు,

తే. వ్రాసితి న్నేను దగు నుపన్యాస మొకఁడు, దాని సభలోనఁ జదువంగఁ బూనునంతఁ
గంపముదయించెఁ జెమ్మటల్ క్రమ్మెఁ గనులు, పచ్చఁబడె నాకు గాద్గద్య మెచ్చిపోయె.

క. పదపడి తత్పత్రిముఁ గొని, చదివె మజుందా, రతండుఁ జవు లుట్టెసడర్
మృదుతామాధుర్యగుణా, స్పదశక్తి నుపన్యసించెఁ బ్రత్యేకముగన్. ౧౨

క. మొరయించి రంత సభ్యులు, కరతాళమ్ముల మోదం బఖండమ్ముగ, న
త్తఱి నేమి సెప్పమ నరుఁగ, వరియించెను లజ్జ దుర్నివారం బగుచున్. ౧౩

సీ. అవల విద్యాభ్యాస మది పూర్తి గావించి, మాతృదేశమునకు మఱలువేళ
నాకుదిండిని మెక్కనట్టినెయ్యుర కెల్ల, విందుఁ జేసితి; నాంగ్లవిషయమందు
నాటపాటలతోడ నార్భాటములతోడ, వాఙ్ముఖంబులతోడ వఱలు నద్ది
పాశ్చాత్త్య లోకవిద్యపగిది నేతత్ క్రియఁ, గౌరవించుచునుండు, నాయొనర్చు

ఆ. నల్లఁతివిందునందుఁ గలవు వినోదముల్, దాన మత్కృతజ్ఞతను వెలార్ప
మొదలుకొంటిఁగాని మొదటివాక్యమ్ముపై, వెసల దయ్యె నొక్కనుడియు నదిర!

తే. ఎల్లరకు నుల్లము ల్గడుఁ బల్లవింప, హాస్యరస మూర నే మాటలాడ నెంచి
సంతసమ్మున వావిచ్చునంతలోన, యూస లడుగంట నెగతాళి కగ్గమైతి. ౧౪

ఆ. తుదకుఁ "దాము కరుణతోఁ గుశల మెంచెసి, నందులకు ననేక వందనంబు"
లనుచుఁ దుర్బ్రంచి వైచి యవ్వాల నవమాన, భార మడరఁ గూలఁబడినవాఁడ. ౧౬

మ. ననుఁ బాయదయ్యె నెన్నండు నీలజ్జ, యడఁగెనయ్యది దక్షిణాఫ్రికాఁ గొంత
యంతియ కాక నే నవిలంబితముగ, భాషింపలేనైతిఁ బదుగురలోన
నప్పుడప్పుడు గేలి నందుచే తప్ప, నీసిగ్గుచేత నా కెట్టిలోపంబు
సమకూరదయ్యె నీ సంకోచ మప్పుడు, కడుఁ గొందలమ్మును గల్గించెఁ గాని
యానందదాయకం బయ్యె నాకిపుడు, మితశబ్దములు వాడు మెలఁకువ దీనఁ
గుదిరె వెండియుఁ గోరుకుల నడ్డగింపఁ, గలబలం బధికంబుగా నేనుపడియె
నర్థశూన్యం బైనయట్టిశబ్దంబు, నే నెన్నఁడుఁ వచియింప లిఖింప
నని పల్కనేర్తు భయం బింతలేక నాపల్కులో లేఖనమ్ములో నెపుడు
దోస మొక్కటియైనఁ దొరలిన ట్లెఱుంగ నీరీతి దురవస్థ లెన్నియో తొలఁగ
సదుపయుక్తంబయ్యె సమయం బదెల్ల, నిజమునకుం గొల్వు నెఱపునాతనికి
నావశ్యకంబు మానాశ్రయం బనుచు, నెఱిఁగించె నాకు నెంతే ననుభూతి
యెఱిఁగియే నెఱు, గకయే నప్పుడప్పు, డతిశయోక్తికిఁ బూని యందు నిక్కమ్ముఁ
గప్పిపుచ్చుచు నుంద్రు గద పెక్కుమంది, యిదినశింపఁగమాన మెంతయున్ వలయు
నర్థశూన్యంబు లైనట్టిశబ్దములఁ, బలుకఁ డెన్నఁడు మితభాషియౌ నరుఁడు
పరిషత్తులందు నుపన్యసించుటకు, గుర్రిక్కిళ్లు మిర్రిగుచు గోష్ఠినాయకుల
నవకాశ మొసఁగుఁ డయ్యా! కొంచె మనుచు, వేధించువారలు వెలితి యైనట్టి
సమితి కాన్పించునే సామాన్యదశల, నెట్టకేలకు నాజ్ఞ నెనసినవక్త
ప్రాయికమ్ముగఁ గాలపరిమితి నిమ్రఱు, వెండియు వ్యవధికై విజ్ఞప్తి సేయు
నాన తీకున్నను నల్లె మాటాడు, సమయమ్ము వ్యర్థమ్ముసలుపుటే కాక
యితఁ డొనర్చెడి జగద్ధిత మింక నెద్ది, నాబిడియంబపో నాకు డాలయ్యె
ననుఁ బరిపక్వం బొనర్చె నాసిగ్గె, చెలియయ్యె సత్యసంసేవ నాకదియ. ౧౭

* * *

## ౧౫ అసత్య వర్ణనము

తే. ఆంగ్ల దేశమ్మునందు విద్యార్థిమాత్రు, లెల్లరును బ్రహ్మచారులై యెసఁగుచుంద్రు
చదువునకుఁ బెండిలికిని జుక్కెదు రటంచు, వార లుత్సాహపడరు వివాహమునకు.

క. మున్ను మనసంఘ మెంతయు, నున్నిదర్శిదశఁ వెలుంగుచున్నప్పుడు వి
ద్యన్నేర్పువానిఁ బిల్చిరి, పన్నుగ నల బ్రహ్మచారి పదమున లోకుల్. ౨

వ. అయ్యువతి నాతోడ నయ్యాయివిషయంబుల ముచ్చటించుచు నన్ను వేవేగ
లాగుకొనిపోవుచుండె – నసుమనసుమ నొక్కొక్కమాఱు నే నెద్దియో వక్కా-
ణించుచుఁ గడ కౌననియో కాదనియో బళిరా యనియో తెస్సయనియో
మెల్లన పల్కుచుంటి – నజ్జవ్వని విహంగివోలె జివ్వున జనుచుండ నేండియు
నిలు సేరు టెప్పటికో యని నేను జిచ్చవడం దొడఁగితి – నిత్తెఱంగున మే మగ్గిరి
శిఖరంబు నారోహించి కొంతతడ వందు నిలిచి యంత నవరోహింప సాగితి –
మ త్తరుణమునం దయ్యబలారత్న మున్నతి పాదుకాధారిణియయ్యు ధనుర్విముక్త
నారాచంబుపోలెఁ గ్రిందికి వచ్చుచుండ నే ననువుల నఱచేత నిడికొని తల్లడం
పడుచుంటి – నంతియకాక మాకన్నియ నాకంగాపు నెచటఁ గిన్నానునో యను
సిగ్గు నా మొగింబున జందులు ద్రొక్కుచుండె – నయ్యవసరంబున ౧౬

తే. వెనుదిరిగి నన్నుఁ గాంచియవ్వేలఁద నవ్వి, యిట్లుర మ్మిట్లుదిగు భయంబేల యూఁత
గొనుము వలసిన నన్నలం చనుడు నేను, దొప్పదోఁగితి నవమానతోయరాశి.

తే. ఒక్కచో బందిమాడి వేఱోకట దేఁక, కొన్ని తావులఁ గూర్చుండి కొట్టుకొనకు
నెటులో ధన్యోస్మి యనుకొంచు నిలకు జేర, నెంతయుం గేళిచేసె నయ్యింతి నన్ను.

వ. ఎల్లయెడల నిట్లు తప్పించుకొనుట సాధ్యము కానేరదు – దయామయుఁ డగు నీశ్వ
రుఁడు నా యీవ్రణంబును మాన్పఁ దలంచె – నెట్లన ౧౮

సీ. ఆరోగ్యనిలయమై యలరు "బ్రైటన్" నామ, జనపదంబున కొక్కనారి వెడలి
యన్నవిక్రియశాలయందలి భక్ష్యముల్, పయినంబు "ఫ్రెంచి"లో వ్రాసియుంట
నబ్బాస రాకయే నఱిముఱిపడుచుండఁ, దత్ప్రత్యవృద్ధవితంతు వోర్తు
నాయవస్థ నెఱింగి నను గూర్మిమైఁ బల్క, రించి నీ వేటి కీరీతిఁ గలఁతి

ఆ. పడెద వనఁ బరాసుబాస రాదయ్యె నా, కేను శాకభోక్త నింపు భోజ్య
మెద్దియో యెఱుంగి కిబ్భంగి గగ్గోలు, పాలఁ బడితి నంచుఁ బలికినాఁడ. ౧౯

క. అంతట నయ్యామ వివరణ, మంతయు నీ కెఱుకపఱుతు నని భోజ్యపదా
ర్థాంతరము లెల్లఁ దెల్పుడు, సంతస మెసలార నప్డు సాపడినాఁడన్. ౨౦

ఆ. ఇటుల మాకు మొదటియెఱుక ప్రసంగె న, య్యాదియ నేస్తమయ్యె నంత నంత,
నవల సీమనున్నయన్నాళ్లు, నవ్వెన్క, నైనఁ దొలఁగ దయ్యె నల్లచెలిమి. ౨౧

క. మఱి లండనునం గల తన, యిరవునకుం గుర్తుసెప్పి యెపయక ప్రతిభా
స్కరవాసరమున విందున, కరుదెమ్మని నన్నుఁ గోరె నయ్యామ పెర్మిన్. ౨౨

వ. అదియునుంగాక పండువు లాదిగాఁగల వేడుకదినంబు లొదవునపుడును నన్నాతి
థ్యమున కాహ్వానింపసాగె – నేను నందులకుఁ గృతజ్ఞతమై నియ్యకొని యయ్యాయి
దినంబుల నెడఁలుచుంటి – నంత ౨౩

ఆ. విందులందు నాదుమందాక్షమును బాఱఁదోలి నెంచి యన్యఘాటి మంచి
కన్నియలకు నన్నుఁ గాన్పించి వారితో, ముచ్చటించు వీలు నిచ్చె నాకు. ౨౭

తే. సరససల్లాపముల నిట్లు నెఱపుకొలుపుఁ, గలుప ప్రత్యేకముగ నొక్కకన్నె యచట
నాపడుచుతోడ నేను మాటాడువేళ, నెడలు మమ్ముఁ బోఱుచు యావృద్ధనారి.

ఆ. పలుకుపాం దెఱింగి భాషింపఁ జాలమిఁ, గేరడంబు లాడనేరకున్కి
వ్యంగ్యభరితవాక్యభంగు లే నెఱుఁగమి, నించదయ్యె నాకు నిద్ది లోలుప. ౨౮

క. ఆవల నవ్వోలఁదుక తగుఁ, త్రోవలు సూపింపఁ బెత్తుకతూహల మంతన్
దైవాఱ నెల్లవేళల, భావం బాటాడె నాదివారముకొఱకున్. ౨౯

వ. ఇట్లు లప్పడుచుతోడి ముచ్చటల కిచ్చవడి యవకాశంబు వచ్చినప్పు డెల్ల నచ్చెలియ చెంతకుఁ జొచ్చుట కుత్సహించితి – సత్తితి నమ్మకముసలి యక్కన్నె దెస నాకెంతయు నాసగొలుప నారంభించుట మున్ముసంధింప నియ్యమ్మ కేదియో యభిలాష ముండునని తలఁచి శంకాసాగరమునఁ గ్రుంకులిడి "కిట్టా! యెట్టిచెట్ట వాటిల్లె – మొట్టమొదటన నావివాహగాథం దెలిపికొన్న నిట్టిసమావేశము నిప్పి సంఘటింప కుండుఁగదా! – గతమునకు వగచినం గల్గు మేలెయ్యది – యికనైనం ద్వరపడి యీనేరము సవరించుకొంట కర్తవ్యము – నిక్కంబు నివేదించుటయ నాకెల్లభంగుల నిపుడు లెస్స – యని తలంచి యీయమ్మ కిట్లు కమ్మ పంపికొంటి.

క. అంబరో! బ్రైటనులో మన, కుం బరిచయ మొదవు టాది కొమరునివలె న
న్నుం బ్రేమించితి వెల్లవిధంబుల నను సంస్కరింపఁ దలపోసి తహహా. ౩౦

తే. నాకు నిపుడు వివాహం బొనర్ప మీర, లెంచినార లటంచు నూహించుచుంటి
మీకు మది నట్టిముచ్చట లేకయున్నఁ, బూని కూర్తురె పడుచులపొందు నిట్లు.

క. మీకరుణకే నర్హుఁడ, నా కెప్పుడో పెండ్లి జరిగినది కర్జంబుల్
పాకము దప్పకమును పే, యీకథ మీ కెఱుకసేత హితమాను గదా. ౩౧

క. నాకుం బెండిలి యగుటయు, కాక కుమారుండు నొకఁడు కల్గెను ముందే
మీ కివ్విషయము దెల్పుట, నాకృత్యము కాని మానినాఁడను దాసిన్. ౩౨

తే. ఇచట భారతవిద్యార్థు లెల్లఁ దమకుఁ, బెండ్లికాలే దని వచించువిధము నెఱిఁగి
కల్లలాడితి నేను నక్కరణిఁ దొల్లి, యిప్పు డయ్యది యొగ్గటం జెఱుకపడియె. ౩౩

ఆ. ఇంతదాఁక మీకు నివ్వార్తఁ దెలుపమి, కేను మిగులఁ జింత నెనయుచుంటి
నైన నేఁడు నిక్కమాడుధైర్యము నీకుఁ, డోసఁగెఁ గాన వేడ్క నొందుచుంటి. ౩౪

ఆ. నీతిబాహ్యమైన చేఁతల నయ్యింతి, చెంత నింతవఱకుఁ జేసియెఱుఁగ
నిం దసత్య మించుకేనియు లేద మ, న్నింపరొక్కొ నన్ను నెయ్య మలర. ౩౫

మం. ఈలేఖమ్ముం బఠియించినవెనుక,నోతల్లి! నేను మీ రోసఁగువిందునకుఁ
బాత్రుఁడఁ గానంచు భావింతురేని,యయ్యది నే దోస మని నిర్ణయింప
విన్నాళ్ళనుండి నాయెడ మీరు సూపు,మమతే నక్కటికంబు మఱచిపోనేర
నేనాఁటికిని వానిఋణ మీఁగఁజాల, నన్నిఁక మీవిందునకును బాత్రునిగ
నెంచదరేని యే నెల్లచందముల,నప్పాత్రతం గొనియాడి సౌఖ్యంబు
లెప్పటివలె నంది యెంతు నద్దాని,భవదమలప్రేమభావాంక మనుచు. ౩౬

వ. ఈవ్రాయసంబు నీరీతి సంతరింప నే నెన్నిగంటలు తంటాలు వడితినో చదువరు
లెఱుంగుదురుగాక!- యీరచన ముగియులోపల నెన్నిచిత్తు లవతరించెనో వేఱ
చెప్పనేల - కాని యీవక్కణతో నాభార మెల్ల దూరమయ్యె - నయ్యమ్మ
దానిం గన్నవెంటన యిట్లు ప్రత్యుత్తరంబు నంపె. ౩౭

ఆ. చాటుమాటు విడిచి సకలంబు విశదంబు,గాఁగ నీవు పంపు కమ్మవచ్చెఁ
బడుచు నేను దానిఁ బొడఁగాంచి కడుపుబ్బు,నటులు నవ్వుకొంటి మయ్య గాంధి!

తే. నీ వచించినబొంకు మన్నింప నర్హ,మిపుడు నిజమాడి తది యెంతయేని లెస్స
వెనుకటివిధాన నినుఁ బిల్తు విందుకొఱకు, రమ్ము రేపటిభానువారమ్ము విడక. ౩౯

ఆ. ఎదురుసూచుచుందు మేము నీకొఱకు నీ,పెండ్లిసుద్దులెల్ల వెల్లడించి
మాకు నిండువేడ్క చేకూర్పు, మనచెల్మి,చెడదు దీనఁ బెక్కునుడువు లేల. ౪౦

వ. ఏ నిట్టిలేఖకు నెంతయు సంతసించి యథాపూర్వ మా నారీమణిగారవంబును
జూఱలాడుచుంటి - మఱియు ౪౧

తే. పూని బొం కనుపుంటి నిప్పోల్కి మూల,ముట్టుగాఁ గత్తిరించితి, నట్టివెనుక
నాదుపెండిలిసుద్ది నెన్నండు నిక్క,మాడుటకు నేను వెక్కముం దాడియెఱుఁగ. ౪౨

* * *

## ౨౧ మతపరిచితి

సీ. ఆంగ్లదేశమ్మునయందు నావసియించు,కాలమునం బెండ్లిగానివార
లన్నదమ్ములును దివ్యజ్ఞానసామ్రాజ్య,కులు నగువార లిద్దరు వయస్యు
లబ్బిరి నాకు; వా "రార్నాల్డు"పండితు,గీతానువాదంబుఁ బ్రీతి వెలయఁ
జదువుచుఁ దమతోడఁ గదిసి వేలుపునుడిక్క,దనరుగీతఁ బఠింప నన్నుఁ బిలిచి

ఆ. రేను దల్లిబాసనేని దానిం జదు,వమికిఁ గరము లజ్జఁ బల్లటిల్లి
సంగడీండ్రతోడ సంకోచ మడర నా,విషయమెల్ల నపుడు వించినాఁడ. ౧

వ. అంత జేజేలబాసం గల నాచొఱవ కొంచియమని యెఱిఁగియు నయ్యాంగ్లాను
వాదంబు మూలమున కెందెందు వేఱయ్యె నయ్యది కనుంగొనఁగల బలిమికిఁ
గొఱంత లేదని యూహించి యచ్చెలికాండ్ర కవ్విషయము నెఱుకపఱిచి
వారితో భగవద్గీతం బఠియింపఁ దొడఁగితి – నంతలి ౨

ఆ. సంతతముగ విషయచింతన గావించు, పూరుషునకు వానఁ బొడము సంగ
మంకురించుఁ గామ మాసంగమునఁ జేసి, యామతిల్లు నలుక కామమునను. ౩

ఆ. అలుకవలన మోహ మగ్గలమై పొల్చు, మోహనమునను మఱపు మోహరించు
మఱపు హెచ్చి హెచ్చి మతి నడఁగారించు, మతినశించు కతన మడియు నరుఁడు. ౪

వ. అను పద్యములు నాచిత్తంబునఁ బొదుకొనియెఁ – దన్నినదము నాశ్రవఃకుహరం
బుల నింబుగా నేఁడును రవళించెడి – నిగ్గీత విలువ యిడరాని పొత్తమను నమ్మిక
నాకు నానాఁటికిం బొంపిరివోవుచున్నయది – తత్త్వజ్ఞానమున దీనికిఁ దులయగు
గ్రంథము వేఱొకం డేవాఙ్మయమునందును లేదని నాకు దృఢవిశ్వాసము గలదు –
నా చిత్తము కలఁగంబాఱినపుడెల్ల నియ్యది యెనలేని మేలొనరించె – దీనికి
నింగిలీసుబాస నెన్నియనువాదంబు లేర్పడె వాని నెల్లఁ బఠియించితి – నం దార్నాల్డు
రచితంబ మేలుబంతియని నాయాశయము – నే నీనెయ్యురతో నియ్యుప
నిషత్తుం జదివినను దీనినపుడు బాగుగఁ బఠించితినని పలుకనోపఁ – దదనంతరమునం
గతిపయవత్సరములు చెల్లిన వెన్క నియ్యది నా దైనందినపారాయణమునం జేరె –
వెండియు ౫

తే. సిద్ధమతియైన యార్నాల్డు బుద్ధుఁ గూర్చి, యాసియాజ్యోతి యను పేర వ్రాసినట్టి
గ్రంథముం బఠియించితిఁ గాంక్ష వెలయఁ, గరము నలరించె నప్పుస్తకంబు నన్ను.

సీ. మఱియు నచ్చెలు లొక్కమాఱు నన్ను బిసెంటు, నకు నెఱిఁగించి రన్నాతిమిన్న
యర్థించెఁ దనదుదివ్యజ్ఞానసంఘమునందుఁ బ్రవేశింప మనుచు నన్ను
నామతం బెఱుఁగనినాఁ డన్యమతము న, వ్విధని బూనుదు నంచు వినయ మెసఁగఁ
జెప్పి తిరస్కరించితి నామె కోరిక, నవలఁ దద్ధితవాణి ననుసరించు

తే. తన్మతగ్రంథమును శ్రద్ధఁ దాల్చి చదివి, నాఁడ నద్దానఁ దనకు హైన్దవమతమ్ము
తత్త్వముం బ్రకటించు గ్రంథముల నెల్లఁ, జదువ నభిలాష ముదయించె
హృదయమందు ౬

వ. వెండియు నప్పరసమునం జేసి క్రైస్తవమతబోద్ధలు హిందూమతము గుడ్డినమ్మిక
లకుఁ బుట్టినిల్లని తెగడునగడు నిరాధారమని యెఱింగితి – నదియుంగాక ౭

సీ. ఆకాలమునయంద శాకాన్నశాలలో, నుత్తమక్రైస్తవుఁ డొక్కరుండు
పరిచితుఁడై నాకు నెఱిఁగించె నాత్మీయ,మతమహిమంబు ప్రేమమ్మగదుర
నలరాజకోటియందలి క్రైస్తవమతప్ర,వర్తకు ల్పూనుదుర్వర్తనంబు
నతని కే వినిచితి నందుల కాతండు,తద్దయుసిగ్గిలి తల్లడిల్లి
ఆ. యేను శాకభోక్త నెన్నఁడు మద్యంబు,ముట్టి యెఱుఁగ, మాంసమును భుజించి
కల్లు పెల్లు ద్రావు క్రైస్తవు లెందఱో,జగతిఁ గలరు దీన శంకలేదు. ౯

వ. అయినను ౧౦

మం. మద్యమాంసంబుల మరగుఁ డటంచు,నెందును శాసించి యెఱుఁగదు బైబ
లద్దానిఁ బఠియింపుఁ డంతయున్మీకు,నవగతం బగు నన నగు నంటి నేను
బిదప నతండు బైబి లొసంగెనాకు, శ్రద్ధమై నద్దానిఁ జదువ సాగితిని
దానిభాగంబు ప్రాఁతనిబంధనమ్ము,పఠియించుతఱి శిరోబాధ నన్నేఁచెఁ
గ్రొత్తనిబంధనకుం జెందుభాగ,మానందవారాశియం దోలలార్చె
నద్దాన విలసిల్లు నద్రిప్రవచన,మెన యగు గీత కం చేఁ దలంచితిని
ధర్మేతరంబు నధర్మంబుచేత,నిర్మూలముఁగఁ జేయనేర వీ వెపుడుఁ
జెనఁటివై నీకుడిచెంపపై నెవ్వఁ,డేని గొట్టినఁ జూపు మెడమచెంపయును
బలిమిమై నెవఁడేని పై వల్వఁ గొనిన,నంతరీయమ్ముసైత మాతని కొసఁగు
మనెడిసూక్తులు నన్ను నలరించె మిగుల,"సలిలంబు నీకు నిఁజాలినవాని
కిష్టమృష్టాన్నంబు నిడుమా" యటంచుఁ,బలికిన శ్యామలభట్టాఖ్యసుకవి
తల్లజుపద్యంబు తలఁపునం బాఱెఁ,దాదృశంబగునట్టి త్యాగంబ జగతి
మంచిమతం బని మది నమ్మినాఁడ. ౧౧

వ. అంత నీ వ్యాసక్తి న న్నితరమతస్థాపకులచరిత్రము లెఱుఁగం ద్వరపెట్టుడుఁ గార్లయిలు రచియించిన 'పీరులు - వీరపూజ' యనుగ్రంథముం జదువఁదొడఁగి యందలి మహమ్మదుజీవనకథం బఠించి యతనిగొప్పతనంబును మగతనంబును దబిసితనంబును దెలిసికొంటి_నంతలోఁ బరీక్షలు చేరువయగుటం జేసి తత్పరనము నాఁపవలసివచ్చెఁ_గాని సర్వమతమర్మముల నెఱుంగవలయు నని నిర్ణయము గావించుకొంటి - నత్తరుణంబున నాస్తిక మతతత్త్వంబు నెఱుంగఁ గోరి తత్సంబంధిగ్రంథము నొకదానిం జదివితిఁ - గాని నే నప్పటికి నాస్తికతామరుదేశముం గడచియుంట నయ్యది నాకు నించదయ్యె - నపుడ వసంతాదేవి నిరీశ్వరవాదంబు విడిచి సేశ్వరవాదంబు నవలంబించె - నప్పరిణామము సైతము నాస్తికతయెడ నా కనాసక్తి కలుగఁ దోడయ్యె - నింకను గొన్ని కారణములు సాయపడుటం జేసి నా కమ్మతంబుదెస నసూయ వొడమె.

***

## ౨౧ దిక్కులేనివారికి దేవుఁడే దిక్కు

వ. ఆర్షమతంబుతోడను మహమ్మదీయ క్రైస్తవాద్యన్యమతంబులతోడను నా
కించుక పరిచయ మున్నను సంకటసమయములం దయ్యది సన్నుద్ధరింపఁజాల
దని నాకుఁ దెలియదయ్యె-నిక్కట్టు లొదవినపుడు తనకు దేవ రక్షణము గల్గు
దానిఁగూర్చి మనుజున కపు డెఱుక యుండనేరదు-నాస్తికుఁడు తనవిపత్తు
తొలఁగుటకు నిసర్గమ మాలంబనుఁ- దన్ను భగవానుఁడు మనిచె ననియు నందు
లకుఁ దన తత్త్వజ్ఞానమును, దపస్సాధనయు నొకహేతు వని యాస్తికుఁడు
భావించు-నిల్లెల్లరుం దమయిచ్చవచ్చిన ట్లూహింప నడ్డులేదు-మానవుం డెపుడు
తనసాధనాబలంబున కహంకరించు నపుడ తద్బలంబు నిర్మూలం బగునని యెఱుంగ
వలయు-నిట్టివేళల యందు శాస్త్రజ్ఞానముకంటె ననుభూతి పరమావశ్యకము-
కేవలశాస్త్రజ్ఞానము నిరర్థకం బనువిషయముం దొలుత సీమలోఁ దెలిసికొంటిఁ-
దత్పూర్వము వాటిల్లిన యాపదలనుండి యే నెట్లు బయటఁ బడితినో చిన్న
వాఁడ నగుట నాకెఱుకపడదయ్యె- నేఁడన్ననో వింశతివర్షమ్ములవాఁడ-గార్హస్థ్య
సౌఖ్యముం జక్కఁగా ననుభవించితిఁ- బైపెచ్చు బిడ్డతండ్రిని సైత మైతి - నిట్లు
నే నాంగ్లావని న్వసించు తుదివత్సరమ్మున ౧

తే. పోర్ట్సుమతు నాఁ జెలంగెడి పురమునందు,జరిగె శాకాన్నభోక్తలసభ యొకండు
దానిఁ దిలకింప నొకనేస్తకానిఁ గూడి,యేను వెడలితి వేడ్క నాహ్వానమంది. ౨

తే. కడలికరవాఁక యగుటచేఁ గర్ణధారు,లుండి రవ్వేటఁ బెక్కు, రందున్నవారుఁ
గంట్లు పెక్కండ్రి నెలమాండ్రి కారుగాని,యించుకేనియుఁ జక్కటి నెంచఁబోరు. ౩

తే. అట్టిచానలతో నిండినట్టిఁయింట,నిలిచితిమి మేము నైనమ్మ తెలియకునికి,
రాత్రిభోజన మైనతర్వాత మొదలు,పెట్టితిమి నెయ్యురం గూడి పేకరంతు. ౪

సీ. తమయింటియతిథిబృందము తోడఁ జెలులు పే,కాడునాచార మయ్యాంగ్లభూమిఁ
దనరు, నయ్యాటలోఁ దప్పులేని ఛలోక్తు,లెలమిమైఁ బల్కెద రెల్లవారు
మేమున్నగీమునచామ లీనడవడిఁ,బాటించి మాతోడ నాటనాడఁ
దొడఁగి రయ్యది రెండుగడియల సాగ న,ప్పుడఁతు లంతట నీతిబాహ్యమైన

ఆ. వేడుకలకు మొదలువెట్టిరి బీభత్స,రసము వెల్లివిరిసె రచ్చలోన
నందుఁ బాలుగొనియె నక్కట! నామిత్రుఁ,డెఱుఁగనైతి నాతఁ డిట్టిఁడనుచు. ౫

ఆ. ఇచ్చవడితి నేను నీముచ్చటల కయో,ముదురసాగె సరసములు కరమ్మ
పేకముక్క లవలఁ బెట్టునవస్థయు,సిద్ధమయ్యె నేమి సెప్పువాఁడ. ౬

వ. ఇంతలో భగవానుఁడు నాసంగడీనియంతరంగమునఁ జేరుటంజేసి యతఁడు
నన్నిట్లనియె. ౮

తే. బళిరె! యీఘోరకలికి నీపాపమునకు,నకట! నీవును బానిస వగుదువోటు
వలదు నల దిందు నీ వుండవలదు వలదు,లెమ్ము లేలెమ్ము పొమ్ము పోపొమ్ము వెలికి.

క. అనవుడు లజ్జాంబుధిలో, మునిఁగితి నప్పనుపు మస్తమునఁ దాల్చితి నా
తని మది మెచ్చితిఁ బదపడి,జననికడ నొడువుబాస జ్ఞప్తికి వచ్చెన్. ౯

వ. పదంపడి ౧౦

క. ఊడనిఁబొడితి గడగడ,లాడితి నానిల్చుసజ్జ కరిగితి మృగయా
పీడకుఁ దప్పినహరిణము,జాడ న్నాగుండె లదరె జడిగొనెఁ జెమటల్. ౧౧

ఆ. నాఁటిరేయి నిదుర నను డాయదాయె నా,యాత్మఁ బెక్కుచింత లలముకొనియె
నిదియె నాకు లాఁతియింతులపల్లవి,కార నొందవ మొదటిసారి యాయె. ౧౨

ఆ. అంత నెంతచెట్ట యయ్యె దైవంబ! యి,క్డేమెల్లి యున్న నెట్టులగునొ
యని తలంచి యింకనైనఁ బరాకును,దలఁగవలయు నంచుఁ దలఁచినాఁడ. ౧౩

తే. అవల నిది వాసయోగ్య మైనట్టితావు,కాదు కాదని యెంచి సంగాతిఁ దొఱఁగి
నాఁటివఱువాత లేచి పైనంబుగట్టి,వీడనాడినవాఁడ నప్పాడువీడు. ౧౪

మం. భగవానుఁ డపుడు నన్బాలించె ననుచు,లెస్సగాఁ దెలియంగలేనైతిఁ గాని
సకలకష్టములందు సాఁకె నన్నతఁడ, యిప్పు డవ్విషయంబు నెఱిఁగికొన్నాఁడ
నీపరిజ్ఞానమం దింకను నాకు,సంపూర్ణ మగునట్టి చతురత లేద
యనుభూతిచేఁ గాక యన్యమార్గమున,వేద్యంబు గాని దవ్విషయ మెవ్వనికి
నాధ్యాత్మికక్రియలందుఁ బెక్కింట, నల న్యాయవాదికృత్యంబునయందు
నైకసంస్థల నిల్పి నడుపుకాలమున, రాజకీయాఖిలారంభంబులందు
నేచి నన్బాదివినయిక్కట్ల నెల్లఁ,దొలఁగంగఁ ద్రోలి నిస్తులదయ న్నన్ను
నేలినజగదీశు నేలీల మఱతు,వెరవులు సకలంబు విఫల మైనపుడు
తోడున్నవారెల్లఁ దొలఁగినయప్పు, డవకాశ మంతయు నడఁగారినప్పు
డెట్టులో చేకూరు నీశ్వరుసాయ,మే ననుభుక్తిచే నెఱిఁగితి దీని. ౧౫

వ. మఱియు స్తుత్యుపాసనాప్రార్థనము లంధవిశ్వాసములుగా – వన్నపానాదుల
కంటె నయ్యవి కడుంగడు సత్యంబు – లవియ నిక్కంబులు – శేషంబు లెల్లం
గల్ల – లనుట స్వభావోక్తికి దూరం బనరా – దియ్యుపాసన నుడికారపు సొంపు
గాదు – దీనికి నాధారము చిత్తముగాని జిహ్వగాదు – కాన మానసికమాలిన్య
మును భక్తిరసముచేఁ గడిగివైచికొన్నవార లప్పరమాత్మను బ్రాపింపఁ గల –

రమ్మాలిన్యమును నిర్మాలింప మనఃపూర్వక మగు నుపాసనకంటె సమగ్రమగు
సాధన మితరంబు మృగ్యంబ – యది కడుంగడు విధేయతతో నెనసియుంట
యెంతయు నావశ్యకంబు. ౧౬

* * *

## ౨౨ నారాయణ హేమచంద్రుఁడు

క. భారతమునుండి యత్తఱి,నారాయణహేమచంద్రనాముఁడు సీమం
జేరె నతఁడు రచయితయై,పే రందినవాఁ డటంచు వినియున్నాఁడన్. ౧

సీ. ఆకారమున వేసమందు వాగ్ధోరణి,నొకవికారపురీతి నొప్పు నాతఁ
డతనితోఁ బరిచయమయ్యె నా కొకచోట,బిలిచితి నతని నానిలుచుబసకు
నింగ్లీషు బోధింపుమీ! యని యతఁడు న,న్నర్థింప నీకొంటి నందులకును
మొదలిడితిం బాఠములు సెప్ప, వ్యాకృతి,జ్ఞాన మాతని కించుకేని లేద

తే. "బాలుఁ"డను దానిఁ గ్రియ యంచుఁ బలుకుఁ"జదివె" నన్నది విశేష్య మనిచెప్పు నతని దిద్దఁ
దరముకాదయ్యెఁదనకు, వ్యాకరణమిట్లు,రామి కతఁడెన్నఁడును విచారమ్ముపడఁడు.

వ. ఆతం డొకమఱి నన్నుఁ గాంచి "మిమ్ముంబలె నే నెన్నఁడుం బాఠశాల కేగనైతి–
నాయభిప్రాయము వెల్లడించు తఱి శబ్దశాస్త్రముతోడియక్కఱ నా కెన్నఁడుం
బొడకట్టదయ్యె – హిందీ మరాటీ బంగాళీబాసలం దేను గృతాభ్యాసుఁడ –
మహర్షి దేవేంద్రనాథఠాకూరు వ్రాసిన వంగకృతుల ననువదించి ఘూర్జరసోద
రుల కొసఁగితి – నింకను బెక్కు సద్గ్రంథముల లాఁతిబాసలనుండి యనువదించి
గుజ్జరాతివారికి సమర్పింప నాకుఁ దలంపు గలదు – మూలమునందలి భావమును
దెచ్చుట మాత్రమ నాయనువాద లక్ష్యము – లక్షణశిక్షాదూరుఁడనై యేనెఱిం
గినబాసయే నాకుఁ బదివేలు – పరిష్కృత మాంగ్లేయభాషఁ జదువఁ దొడఁగితిఁ –
బదసముదాయంబునర్థముఁ దెలిసికొంటయ నాకుఁగర్తవ్యము – కాలక్రమంబునఁ
బరాసు జార్మణ్యము మున్నగు బాసలసైత మభ్యసించి యే నాయాయి దేశ
ములం జూడనెంచితి – ననవుడు నే నతనిఁ గాంచి 3

తే. అమెరికాఖండమునకు మీరరుగరొక్కొ,యనుడు సంశయమేల యే నవ్వినూత్న
విశ్వవైభవ సౌందర్యవీక్షణంబు,సేయ కేరీతి భారతక్షితికిఁ జనుదు. ౪

క. విత్తవిచారము నాదగు,చిత్తమ్మున లేదు నాదుచెలికాండ్రురు నా
పొత్తంబులు నా కొసఁగెడు,విత్తంబే చాలు నాదువెచ్చమ్ములకున్. ౫

క. డంబములతోడుత న్నాకుం బనిలే దేను బొట్టకుం బట్టకు న
ల్పంబుగ వెచ్చింతు వినో,దంబులకుం బోక దవ్వుదవ్వుల నుందున్. ౬

తే. ఏను మూఁడగు తరగతిలోన పయన,మాచరించుచునుందు రే ప మెరికాకుఁ
బోవుచో "డెక్కు"మీఁదన పోదుఁజుమ్మి,రిత్తవెచ్చమ్ము నేల భరింప వలయు ౭

వ. అని యతండు మాఱువల్కె — నిట్టి మేలినడత హేమచంద్రునిసొత్తై వెలయు —
వెండియుఁ దత్ప్రవర్తనంబున కుద్దియగు నుల్లమును మిడిసిపాటులేమియు నతనికి
సవరించని రవణంబులై హావణిల్లుఁ — గాని తనసామర్థ్యముఁ గూర్చి యతనికి మితి
మీఱినవిశ్వాసం బొకటికలదు — మే మనుదినంబును గూడుచుండువార — మతఁ
డును శాకాహారంబ భుజియించు — మా కుభయులకుం జెక్కుచేష్టల సామ్యంబు
దనరు — నిర్వారము స్వయంపాకులము — యొకనాఁ డతఁడు నాకతిథి యగు — న
మ్మఱునాఁ డే నతనికి విందనయ్యెడివాఁడ — బ్రాయికముగా మే మొకతావునందు
యారగించుచుండువార — మిట్లుండ నయ్యవసరంబున ౮

తే. కార్మికులదెస నెంతేని కరుణసూపు,సుకృతి "మానింగు" కీర్తి యస్తోక మగుచు
లండనుపురంబునం దెల్ల నిండుకొనుడు, హేమచంద్రుం డతనిఁ జూడ నిచ్చగించె.

ఆ. అతనిసాహసంబు నరసి మిత్రమ! మేలి,తరము వాఁ డతం డుదారచరితుఁ
డతనిఁ గాంచ శక్యమగునొటు మనబోఁటి, యలఁతి యలఁతివాండ్రి కంటె నేను.

వ. అనుటయు నతం డిట్లనియె. ౧౧

మం. ఏల సందియ మందె దిటు నేస్తకాఁడ,తిప్పక యతని సందర్శింపవచ్చు
వినుము దానికిఁ దగువెర వెఱిఁగింతు, నే గ్రంథకర్తనై యొసఁగినయట్లు
నతనియౌదార్యంబు నతనిశీలంబు,నాలించి కడు ముద మందినయట్లుఁ
గనులార నాతనిఁ గాంచి కృతజ్ఞ,తను వెల్లడింపఁగాఁ దలఁచినయట్లు
నాంగ్లభాష నెఱుంగనట్టి హేతువున,నిను దుబాసిఁగఁ దేర నే నెంచినట్లు
నతనికి నాపేర నంపుమా కమ్మ,యనవుడు నే నట్ల యాచరించితిని
విడువక మీరు రా వేఁడుచున్నాఁడ,ననుచుఁ బ్రత్యుత్తరమంపె "మానింగు"
హేమచంద్రునియత్న మిట్లు ఫలింప,నొదవె నాశ్చర్యం బనూనమైనాకు. ౧౨

వ. అంత నొకనాఁడు మే మమ్మహాశయుం జూడ బయలుదేరితి — మత్తఱిఁ దగు
పటాటోపమ్ముతో నేనుంటిఁ — గాని చెలికాఁడు యథాపూర్వము తనవికృత
వేషంబుఁ దొలఁగింపఁడయ్యె — నందుల కే నించుక గేలిసేయుడు ౧౩

క. డంబముల మెచ్చెదరు పా,ఱుంబోతులు మీరు సత్పురుషు లెప్పుడుఁ జి
త్తంబును మెత్తురు గాని ము,దం బందరు వేసమునకుఁ దళుకుంబసకున్. ౧౪

వ. అని యతండు వల్కెఁ - బదంపడి మే మమ్మాసంగు భవనంబు సేరి యతని దర్శించి వానిసమర్పించు సత్కారములం బడసినవెనక హేమచంద్రుఁ డతని యథోచితము గౌరవించి యాయనదీవనలం బడసె - అంత నేము మా మనికి పట్టులకుం జేరితి - మిట్టుండ నొక్కనాఁడు ౧౫

క. అరచట్టం దొడి కొకిబికి,పరిధానమ్మును ధరించి బారెఁడుగెడ్డం
బరుదుగ నెసంగ నాబస,కరుదెంచెను మద్వయస్యుఁ డాంగ్లము నేర్వన్. ౧౬

సీ. అది క్రొత్తబస యాట నయ్యింటిమగువ త,త్పూర్వము హేమచంద్రుని మొగంబు
నెఱుఁగదట్లాట నయ్యింతి కవాటంబు,విచ్చునంతన బిట్టు వెఱపు నంది
సంభ్రమంబున నామసరసకుఁ బరెమ్ముకొ,వాఱుచు వచ్చి యెవ్వండొ వెడఁగు
సికొాఱ కేతెంచి వాకిట నున్నవాఁ,డనవుడు సంగ్రమ్మనకు నేగి

ఆ. హేమచంద్రువేస మీక్షించి తద్దయు,నక్కజంబువడితి నతఁడు వెక్కి
నవ్వ నవ్వసాగె నామిత్రునకు సహ,జంబు లిట్టిలక్షణంబు లరయ. ౧౭

వ. అయ్యవసరమునం దేను నెచ్చెలీ ! నీ యీ వేషంబుగాంచి వీధిలోని బాలురు గోలసేయక మానిరో యనుడు నతండు ౧౮

ఆ. గోల చేసినారు గుంపులుగుంపులై,పిఱుఁద నడిచినారు పిల్ల లెల్ల
వారిదెసకు దృష్టి సారింపనైతి నే,నంత వెనుకవెనుక కడుగు లిడిరి. ౧౯

వ. అని వాక్రుచ్చె - నిట్లతఁడు లండనునగరమునం గొంతకాలముండి యవ్వలఁ బరాసునాఁటికిం జని యా దేశమునందలి బాసనేర్చి యందలి గ్రంథములఁ గొన్నింటి ననువదించి పదపడి పూర్వోక్తప్రకారముగ నమెరికా కేగి తనకు సాజం బగు వేసముతోఁ దిరుగాడఁ దొడంగుడు నది యాసీమ ననాగరకవేషం బగుట సంయుక్తరాష్ట్రములందు నిర్బంధితుఁడై యెట్టకేలకు విముక్తుఁ డయ్యె. ౨౦

* * *

## ౨౩ గొప్ప సంత

క. పదునెన్మిదివందల తొం,బదియగు వత్సరము క్రైస్తవశకమ్మునయం
దొదవినతఱిఁ బ్యారిసులో,న దొడ్డవస్తుప్రదర్శన మొకటి జరిగె. ౧

ఆ. ఏను దానిఁ జూడ నేగితి దృశ్యముల్,పెక్కు లచటఁ గంటి నక్కజముగఁ
గాని కేవలం బయోనిర్మితంబు గో,పురము నింతవట్టు మఱువ నైతి. ౨

క. పొడుగువెడల్పులు దక్కన్,నడుమం గాఁ దగినయట్టి నౌన్నత్యత కానం
బడదయ్యె నందు, దానన్,దొడరెడుసంతృప్తి యెట్టిదో కననైతిన్. ౩

వ. దానిం దెగడినవారు పల్వురు గలరందుఁ డాల్స్టాయి ప్రథమగణ్యుం డతఁ డిది మానవునియెఱుంగమికి నంగమచ్చం బనియు ధూమపానంబున మఱిపోయిన మానుసు లిట్టిబయలిమేడల నిర్మింతు రనియుఁ బల్కె - వెండియు ౪

క. నాగరకతయును స్వేచ్ఛయు,భోగపరాయణతయున్ బ్రభూతమ్ముగ న
చ్చోఁ గలదు గాని కోవెల,లోఁ గా లిడినంత నాత్మలో మార్పొదవున్. ౫

వ. "వర్జిన్ మేరీ" విగ్రహము నెదుట మోఁకటిల్లి జోహారు లర్పించువారి డాసినతఱి నెవ్వనికి భయభక్తు లుప్పతిల్లకుండు - మోఁకరించుటయు వేఁడికోలును గ్రుడ్డి నమ్మికలు గావని నాయాశయంబు - మఱియు నా భక్తులు మోఁకరించుట నిరర్థకపాషాణమునకా ? తదర్థమైన భగవానునకు - వా రిట్టి విగ్రహారాధనమున భగవన్మహిమను గుంచక పెంచుచున్నా రనియ నాతలంపు. ౬

* * *

## ౨౯ పట్టా పుట్టినది - కాని పిమ్మట ?

తే. న్యాయశాస్త్రంబు చదువంగ నాంగ్లభూమి,కేను వెడలితిఁ గాని యద్దానిగుఱిచి
యింతకు న్మున్ను వివరించి యెఱుఁగనైతిఁ,దదృణభారంబు నిచ్చోటం దలఁగువాఁడ,

వ. బారిస్టరుపరీక్షకుఁ జదువువిద్యార్థికి నియతకాలపరిపాలనమును బరీక్ష లొసఁగుటయు నను రెండుకట్టడలు గల - విప్పరీక్షకుఁ జదువవలసిన కాలము మూఁడేఁడు - లయ్యది యీరాఱుపాళ్ళుగా విభక్తమై యుండు - నందలి ప్రతిభాగమునందును విందు లిర్వదినాళ్లు ప్రవర్తిల్లు - నం దథమ మాఱువిందులకైనను బరీక్షార్థి యేగునేని యతఁడు నియతకాలపరిపాలన మొనరించినట్లు యెన్నంబడు - వెండియు ౧

సీ. తొలుతొల్తనియ్యామెతలయందుగురుశిష్యు,లొండొరుల్ భాషించుచుండు తెఱఁగు
వ్యాఖ్యానము లొనర్చు నాచారమును బ్రవర్తిల్లుచునుండెఁ దత్క్రియలవలనఁ
జదువుగోరెడివారు చదురు లౌనని ప్రశంసించుపోల్కి నుపన్యసించు వెరవు
గణుతికెక్కినలౌకికజ్ఞానమును దగు,నాణియమ్ముగ డించి రాణసెందు

ఆ. వార, లేఁ బఠించువడిఁ కవెల్లఁ దొలంగె,గురుఁడు శిష్యు విడిచి కూరుచుండెఁ
దత్ప్రయోజనంబు దవ్వయ్యె నడవడి, యొండె సాగివచ్చుచుండెఁ జెడక. ౩

వ. పూర్వాచారపరాయణ మగు నాంగ్లదేశమున కయ్యది సహజలక్షణంబు - మఱియు

క. పలలాహారముతోడన్,బలుదినుసులమధువుతోడఁ బ్రాయికముగ విం
దులు సాగు, నందు నాకుం,గలదుగదా! రొట్టెముక్క కాలము గడపన్. ౫

క. ఇటు విందులు గుడుచుటచే, నెటు బారిష్టరుపదంబు నెనయుదురో యి
ప్పటికిం దెలియద నా, క, ప్పటియుఁ దత్పట్ట మంద వలచినవారల్. ౬

తే. చదువవలసిన పొత్తముల్ చాల సులువు, లగుట బారిష్టరునకు హాస్యంపుఁబేరు
రెక్కొనియెఁ "దిండిపోతుబారిష్ట" రంచు, నెల్లరకు వానికందువ తెల్లమయ్యె. ౭

వ. మఱియుఁ బార్యములకంటెఁ బరీక్షావిధానము సులభంబు - కావుటం జేసి విద్యార్థులు వర్షత్రియంబున మాసత్రియము శ్రమింపడినఁ గృతార్థు లయ్యెడి వారు- కాని నే నిట్టి నామమాత్రవిజయమునం దనివి సెందక పరనీయముల సవిశేషముగాఁ జదువనెంచితి-నట్లు సేయమి వంచన యని నాయాశయంబు-నే నింతకు మున్ను లాటిను నేర్చియుంటిఁ-గాన "రోమన్" న్యాయశాస్త్రము నభ్యాసన చదివితి-నిది యాఫ్రికా కేగినతఱి నా కెంతయుం దోడుపడియె - నిట్లుశ్రమించి పరీక్షలో గెలుపొందితి- నంత ౮

తే. కాశ్యపీ ధాత్ర వసు నిశాకాంతసంఖ్యఁ, గ్రీస్తవశకాబ్దము వెలుంగుకాలమందు
షష్ఠమాసంపు దశమవాసరమునందు, బిరుదపట్టంబు నాకు లభించు టాయె. ౯

వ. కాని యింతకష్టించినను న్యాయస్థానమునందు నోరువిప్పఁజాల నను నుత్తలపాటు నాచిత్తమున హత్తుకొనె- నయ్యవస్థ వివరింప వేఱొం డధ్యాయము వలయు. ౧౦

***

## ౨౫ నా బెం గ

క. బారిష్టరుపట్టము చేకూరుట సుకరంబ కాని కోర్టులలోనన్
బారిష్టరుగా రాజిలు, టారయ నెల్లరకు సాధ్య మయ్యెడి పనియా. ౧

ఆ. మొదటినుండి తుట్టతుదిదాఁక నే ధర్మ, శాస్త్రసూత్రకోటి చదివినాఁడఁ
గాని రచ్చలందుఁ గమనీయభక్కి- వా, దించునట్టి వెరవు గాంచనైతి. ౨

వ. ల్యాఁతివారికి నొప్పమి రాకుండునట్లు నీవస్తువు నుపయోగించుకొమ్మనునది యొక ధర్మవచనం-బిది తనవ్యాజ్యెగానికిలాభించుట కెట్లుపయోగింపవలయునోనాకెఱుక వడదాయె- నేతత్సిద్ధాంతమునకుఁ జెందిన వివాదములఁ బఠించితిఁ - గాని యీ సూక్తి యుపయోగించుననునమ్మికక నయ్యవి హత్తింపఁజాలవయ్యె - మఱియు ౩

సీ. చదువనైతిని న్యాయశాస్త్రంబు భారత, దేశసంబంధిని లేశమైన
మనవిపత్రంబు నెమ్మయి సంతరింపంగ, వలయు నవ్వెర వింత తెలియనైతి
నడివాఁక సుడినీటఁ బడి తల్లడంపడు కైవడి నుంటి నక్కాలమందు
వింటిఁ గోర్టులలోన వీరవిహారంబు, సలుపుచుండు ఫిరోజిషా యటంచు

ఆ. నాంగ్లభూమి నెట్టు లతఁ డిట్టినేర్పు నా.ర్జించె నొక్కొ-యని విచిత్ర మంది
యతనిపగ్గె నాకు నబ్బ దీపుట్టువం,దిది యథార్థ మంచు నెంచికొంటి. ౪

క. ఆపిదప న్యాయవాది, వ్యాపారము పొట్టకూటి నైనను నాకుఁ
జేపఱుపంగలదాయను, ద్వాపర మెస రేఁగి నన్ను దండడివెట్టెఁ. ౫

క. ఈసందియములు న్యాయా,భ్యాసం బొనరించుకాలమందే నను బల్
గాసిల్లఁజేయఁ దెల్పితి,నాసంగడికాండ్ర కీమనస్తాపంబుఁ. ౬

తే. అంత నాచింత నెఱిఁగి మేలరసి మిత్రి,మొక్క-రుండు "దాదాభాయియొద్ది కేగి
యతనిహితబోధనము నందు మమ్మహాత్ముఁ,డాదరించును విద్యార్థి" ననివచించె. ౭

సీ. ఆంగ్ల దేశమ్మున కరుగుకాలమ్మున నౌరోజిమహనీయునకు నొకండు
పరిచయలేఖ సంపాదించికొనిపోయి,తి నటంచుఁ దొలుతన తెల్పినాఁడ
నాకమ్మఁ బెక్కు-నా ళ్లైనపిమ్మట వెల్వ,రించితిఁ బురుషవరేణ్యు నతనిఁ
గనుఁగొన నెంతవాఁడను నేను? విద్యార్థి,జనులకష్టమ్ముల సౌఖ్యములను
ఆ. దెలియ సంఘమొండు నిలిపె నతండు త,త్సభల కెల్ల నేను జనుచునుందు
మఱియు నమ్మహాత్మమాటాడురచ్చల,కరిగి సమ్మదంబు నందువాఁడ. ౮

సీ. ఇటు లుండ నొక్క-నాఁ డెట్లెటులో సాహ,సించి యమ్మేటి దర్శించి కాని
పించితి నక్క-మ్మ,నంచితచరితుఁ డా,నౌరోజి పదపడి నన్ను మిగుల
నాదరించి మదీయ మగునుపదేశంబు,నావశ్యకం బగునప్పుడెల్ల
వచ్చి నీవు గ్రహింపవచ్చు నటంచు భా,షించెఁ బ్రేమరసంబు చిప్పిలంగ
ఆ. నట్టులయ్యుఁ దగినయక్క-ఱ లేనప్పు,డమ్మహాత్మునకు శ్రమమ్ము నొసఁగు
టనుచితమ్ము గాన నయ్యవకాశంబు,వలని లగ్గువడయ వలవనైతి. ౯

తే. కావుటంజేసి నాచెల్మికాఁడు నీదు, చింత లన్నింటి నౌరోజిచెంత విన్న
వించుకొ మ్మన్నహితము నవ్వేళయందు,నియ్యకొనుటకు నేఁ దెగియింపనైతి.

వ. అంత నొకానొక నెయ్యునిహితవు ననుసరించి సుప్రసిద్ధాంగ్లేయన్యాయవాది యగు "ఫ్రెడరిక్ పిక్కటు" సన్నిధికింజని నాసందియములనెల్ల నతనితోడ విన్నవించితి-నయ్యుదారచరితుఁడు నన్నుఁ దననెచ్చెలింబోలె గారవించి ౧౧

సీ. జగమునందు ఫిరోజిషా బహురుద్దీను, లను బోలుప్రతిభావిలాసు లెంద
ఱుందురు? తల్లడ మందకు సాధార, ణన్యాయవాదివై నడుచుపొంటె
నక్క-ఱలేదుసు మ్మెక్కు-డు నేర్పు,సా,మాన్యమైనట్టి ప్రామాణికతయు
నాసక్తియును జాలు నద్దాన విత్తంబు,గడియింపవచ్చుఁ బుష్క-లముగాఁగ
తే. దగవు లన్నియుఁ జిక్కు-లం దగిలియుండఁ,బోవు పరనీయపుస్తకంబులను గాక
వింతపాత్తంబులను జదివితివె? వాని,పేరు లెట్టివియో వినిపింపవయ్య. ౧౨

ఆ. అనుడు నాపరించు నలఁతిపొత్తమ్ముల, నెఱుక చేసినంత నించుకంత
చప్పరించి మగుడ జాలిమై నాతఁడి,ట్లనియె మందమధురహాస మొలయ. ౧౩

తే. తెల్లమయ్యెను నాకు నీ యుల్లమెల్ల, ననఘుఁడా! లౌకికజ్ఞాన మరయ నీకు
నదియవో! న్యాయవాదివై బ్రదుక నెంచు,నాతనికి జీవగఱ్ఱయై యలరుచుండు. ౧౪

సీ. ఔర! భారతదేశచారిత్రమైన నీ,వెఱుఁగ వైతివి కదా యింతవట్టుఁ
దచ్చరిత్రము భారతమునఁ బుట్టినవాని, కరయ నవశ్యపాఠ్యంబుగాదె
మొనమొన్న నీదేశమునఁ బ్రవర్తిల్లిన,సైనికవిప్లవచరితసైతి
మయ్యరే! పఠియింపవైతివి మఱి న్యాయ,వాది మర్త్యస్వభావ మ్మెఱుంగ

ఆ. వలయు మొగమువంక తిలకించి నరుఁడెట్టి,వాఁడొ గుఱుతుపట్టవలయు నట్టి
మార్గమెల్ల నెఱుఁగ మౌఖికసాముద్రి,కమ్ముఁ జదువు టవసరమ్ము సుమ్ము. ౧౫

వ. అని యతఁడు నాకవశ్యపఠనీయములగు గ్రంథములపేళ్ళను వానిలభించు తావుల వ్రాసియిచ్చి నన్ను వీడుకొలిపె - నమ్మహనీయుని సల్పినమే లెన్నఁడు న్మఱవఁజాల - నతనిముందు నాసంక్షోభము పంచబంగాళి మయ్యెఁ-గానియదుగుఁ గదలించినంతన సాక్షాత్కరించె - నంతనిలుసేరి మఱునాఁడ సాముద్రిక గ్రంథముల న్వెలిచి చదివితిఁ-గాని నాకవి దురవగాహంబులయ్యె - నివ్విధంబున ౧౬

క. అల "పిక్కటు" హితవచనం,బులు నాకున్ ఫలము నికపోయినను విని
ర్మలమై విలసిలు నాతని, చెలిమి కరుంగడు శుభంబు చేకుఱఁజేసెన్. ౧౭

క. మంచివకీలై ధన మా,ర్జించుటకు ఫిరోజషాగరీయోమేధా
భ్యంచత్ కౌశల మేటి క,టంచు నసామాన్యశక్తి యది యేలంచున్. ౧౮

తే. మఱియు సాధారణంపుఁబ్రామాణికతయు,నోదలు వంచి పనుల్ దిద్దు నడవడికయు
న్యాయవాది కుండినఁ జాలు నని యతండు,వలుకుహితమందు నాకు విశ్వాస మొదవె.

క. ఈలక్షణముల రెంటం,బాలుండినవాఁడ నగుటఁ బొడుకొనియె నా
శాలత మన్మానసమున,దూలెను నాబెంగ దూరదూరమ్మునకున్. ౨౦

వ. ఇట్లుండునంత నాకు బిరుదపట్టము లభించె - నది ప్రాప్తించిన మఱునాఁడ బారిస్టరులపట్టికలో నాపేరు చేర్పించుకొని తదనంతరదినమ్మున ౨౧

తే. చెలులవీడ్కోలు గైకొని సీమ విడిచి,యమ్మనాఁడికకుం బయనమ్ముగట్టి
యెలమి తోలఁకాడఁ బాగయోడనెక్కి వరుస,డాయవచ్చితి నేను బొంబాయిరేవు.

క. రంగత్తుంగాభంగత,రంగాళిఁ జెలంగుచుండె రత్నాకరము
ప్పొంగుచు నే నావిరిపడ, వం గట్టెక్కితిని మిత్రవర్గము మెచ్చన్. ౨౩

